తా॥ అయ్యెడ నా బ్రాహ్మణుఁడును రంభయునుఁ గలసి యావన సమీపమునఁ గలయొక పట్టణమునుఁ జూచి.

—: రంభానిరంకుశులు పొంకి పట్టణమున నుండుట :—

వ॥ కాంచి తత్పట్టణంబు చేరం జనుదెంచి. 67

అ॥ కాంచి - కనుఁగొని, తత్పట్టణంబు - ఆపురమును, చేరన్ - పొందునట్లు, జనుదెంచి - వచ్చి,

క॥ అచ్చట సుఖులై వారిరువు, రచ్చరరాడ్భోగ మెనయ ♦ నతులప్రౌఢిన్
బచ్చవిలుకాని కేళులు, నిచ్చ మెయిన్ జరపుచుండి ♦ రిరువురు వెలయన్. 68

అ॥ అచ్చటన్ — ఆప్రదేశమున, 'అచ్చట' యనునది నిత్యైకవచనము. "సూ. దేశ్యమునం దక్కడాదులు నిత్యైకవచనాంతములు" ప్రౌ. వ్యా. వారు — ఆనిరంకుశుఁడును రంభయును సుఖులై — ఆనందముగలవారై, వియచ్చరరాడ్భోగము — ఇంద్రునివంటి సుఖమును, ఎనయన్ — పొందఁగా, ఇరువురున్ — ఆయిద్దఱును, ఇచట 'ఇరువురు' అనుటకు 'సూ. ఆదేశశ్చవురూపశ్చ సబిందుర్దుత్తమాత్వరః' అథ. వెలయన్ — ప్రకాశించునట్లు, అతులప్రౌఢిన్ — అసమానమైన నేర్పుతో, పచ్చవిలుకాని కేళులన్ — సంభోగములయందు, ఇచ్చ మెయిన్ — ఇష్టము వచ్చినట్లు, ఇచట 'మెయిన్' అనుటకు "సూ. జడపదంబుమీఁదితోడను మెయి మైలు వికల్పంబుననగు" ప్రౌ. వ్యా. మయి అను రూపముకూడ కలదు. "ఉదా. అందఱుఁగూడి మోసలకు నర్థి మెయింజనుదెంచి" నిర్వ. జరపుచుండిరి — కాలమును గడపుచుండిరి.

తా॥ అచ్చోట వాయిరువు రానందముతో నింద్రభోగముగా సంభోగించుచు స్వేచ్ఛగాఁ గాలమును గడపుచుండిరి.

—: ఆశ్వాసాంతము :—

చ॥ ఘనఘన సవ్యసవ్య శితి ♦ కంధరకంధర దానదానవ
ధనధన తప్తతప్తకృత ♦ తారక తారక ధామధామవా
రణ రణరంగ రంగదరి ♦ దారుణదారుణ దారుదారుకా
వనవనధీనధీనవృష ♦ వాహన వాహన సోమశేఖరా. 69

అ॥ ఘన — గొప్పవాఁడా, ఘనసవ్య — అధికులచేత స్తుతింపఁదగినవాఁడా, ని 'నవంనవ్యే పుమాన్ స్తుతౌ' అని మే. సవ్యశితికంధర. సవ్య — వర్ణింపఁదగిన, శితికంధర — నలుపుతోఁగూడిన కంఠముగలవాఁడా. ని "శితిఃకృష్ణే శితిశ్శ్వేతే" విశ్వ. "శితిర్ధవళనీలయోః" నానా. "శితిరశ్మిగ్జే వాసితాసితయోస్త్రిషు" మే. కంధరశబ్దమునకు ని "కంధరో వారివాహే స్యా. గ్గ్రీవాయామపికంధరా" విశ్వం. కంధర దాన — మేఘమువలె దాతృత్వముగలవాఁడా, ని "దానంగజమదే త్యాగే పాలనచ్ఛేద శుద్ధిషు" అనివి. దానవధనధనతప్త. దాన — మదముతోఁగూడిన గజాసురుని, ధన — బాధించుట

కాలకూటాన్నతోషా. కాలకూట — కాలకూటమను పేరుగల విషమే, అన్న — భోజనముగాఁగలిగి తోషా — సంతోషించుటగలవాఁడా, దేవతలును దానవులును సముద్రమును మథించునప్పుడు కాలకూటమనియు, హాలాహలమనియుఁ జెప్పఁబడు మహావిషమందుదయించఁగా దానిని శివుఁడు మ్రింగినందున శివునకు విషాహారము కలవాఁడను ప్రసిద్ధికలిగినది. నిగమచరసువేషా. నిగమ — వేదములయందు, చర — సంచరించునట్టి, సువేషా — మంచిరూపములు ధరించినట్టివాఁడా, అనేకపుణ్యప్రభాషా. అనేక పుణ్య-సుకృతములతోఁగూడిన, ప్రభాషా — మంచిమాటలుగలవాఁడా, అగణితఫణిభూషా. అగణిత- ఎంచశక్యముగాని, ఫణిభూషా — పాములే సొమ్ములు గాఁగలవాఁడా, అహార్యచాపామనీషా. అహార్య- మహామేరువనెడి పర్వతమే, చాపా — విల్లుగాఁగలవాఁడా, మనీషా — సంపూర్ణమయిన ప్రజ్ఞగలవాఁడా, విగతసకలదోషా. విగత — పోఁగొట్టఁబడిన, సకల — సమస్తమయిన, దోషా — పాపములుగలవాఁడా, విస్ఫుటానన్యపోషా. విస్ఫుట — స్పష్టమైన, అనన్య — అధికమైన, పోషా — రక్షించుటగలవాఁడా, ఈవృత్తమునకు లక్షణము. "ననమయయయుతంబై, నాగవిశ్రాంతిదై యుక్తనుసమగుణమాలి ♦ న్యాఖ్యాయంబయ్యెధాత్రిన్" అలం. ఈపద్యమున నంత్యప్రాసము సెప్పఁబడినది.

క॥ మోహజ్వర భైషజ్యస, మీహితకైలాసరాజ్య ♦ మేదురతేజా
జేహీయమానదానవ, బాహాధార్ష్ణ్య జ్య త్రిదివ ♦ పాలకపూజ్యా. 71

అ॥ మోహ............ తేజా. మోహజ్వర — అజ్ఞానమనెడు జ్వరమునకు, భైషజ్య — ఔషధముగా, సమీహిత — కోరఁబడిన, కైలాసరాజ్య — కైలాసమనెడు దేశముగల, మేదుర — చిక్కనైన — దట్టమైన, తేజా — ప్రకాశముగలవాఁడా, ని "తేజః ప్రభావే దీప్తౌచ." ... అనియు. దీనికి నజంతమును హలంతమునను రెండురూపములు కలవు. ... జేహీయ........జ్య. జేహీయమాన — పారిపోవుచున్న, దానవ — రాక్షసులయొక్క, బాహా — భుజబలముయొక్క, ధార్ష్ణ్య — దిట్టతనముతోఁగూడిన, జ్యా — వింటినారిగలవాఁడా, త్రిదివపాలకపూజ్యా. త్రిదివ — స్వర్గమునకు, పాలక — కాపాడునట్టి యింద్రునిచేత, పూజ్యా — అర్చింపఁదగినవాఁడా.

గద్యము. ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధలబ్ధవర్ణవర్ణనీయ కవిత్వతత్త్వధౌరేయ, పెదలింగనార్య[illegible]ర్ణవపూర్ణిమాచంద్రేయ, గురువరాచార్యపదారవింద మిళిందాయమానమానసాత్రేయ, పండితమాన్యతరాజేయ, సకలవిద్వజ్జనవిధేయ, శద్రయనామధేయ ప్రణీతంబయిన నిరంకుశోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము.

అ॥ ప్రథమాశ్వాసమునఁబోలె నెఱుంగునది.

ఇది శ్రీమద్గాయత్రీ విరాడ్విశ్వకర్మ వరప్రసాదజనిత కవితామృత రసపాత్ర, అహభూనస గోత్ర పవిత్ర, అచ్చమాంబా వేంకటశివార్యపౌత్ర, లక్ష్మాంబా కోటీశ్వర సుధీమణిపుత్ర, శిల్పవాస్తు జ్యోతిశ్శాస్త్రాది వివిధవిద్యాప్రవీణ, పదవాక్యప్రమాణ నిధాన, విమర్శకాచార్యశిల్పకళాకోవిదేత్యాది బిరుద నిరుపమాన, బుధారాధన విరాజమాన, సుబ్రహ్మణ్యాభిధాన; విరచితంబైన నిరంకుశోపాఖ్యాన సుధాతరంగిణీ వ్యాఖ్యానమున తృతీయాశ్వాసము.

శ్రీ రస్తు

# నిరంకుశోపాఖ్యానము

## సుధాతరంగిణీవ్యాఖ్యానసమేతము

### చతుర్థాశ్వాసము

శ్రీరమణీరమణీయప, రీరంభస్నేహవిస్ఫు ♦ రితసాయక ని
ర్దారితసుమనస్సాయక, భూరికృపావేశ కంద ♦ పురసోమేశా. 1

అ॥ శ్రీరమ.....సాయక, శ్రీరమణీ — లక్ష్మీదేవియొక్క, రమణీయ — సుందరమైన, పరీరంభ — ఆలింగనముతోఁగూడిన, 'ని. పరిరంభః. పరీరంభః. అ. పు. కౌఁగిలి' శ. రూ. ర. స్నేహ— ప్రేమచేత, విస్ఫురిత — చలింపఁబడిన విష్ణువే, సాయక — బాణముగా గలవాఁడా, నిర్దారితసుమనస్సాయక. నిర్దారిత — చక్కఁగాభేదింపఁబడిన, 'ని. దారితే భిన్న భేదితౌ' అ. సుమనః+సాయక — పుష్పములే బాణములుగాఁగల మన్మథుఁడుగలవాఁడా, 'ని. స్త్రియః సుమనసః పుష్పం. ప్రసూనం కుసుమం సుమమ్' అ. 'శరే ఖడ్గే చ సాయకః' అ. భూరికృపావేశ—భూరి — విస్తారమయిన, కృపా—దయతోఁగూడిన, ఆవేశ — మైమఱచుటకలవాఁడా, కందపురసోమేశా — కందుకూరను పట్టణమునఁగల యో సోమేశ్వరస్వామీ, అని యాశ్వాసాదియందుఁ గృతిపతికి సంబోధనము. ఇందు లక్ష్మీదేవియందనురాగముగల విష్ణువు శివునకు హస్తగతుఁడై యుండెననుటచేత పరికరాలంకారము. "క. సాకూతములై సఫలత, చేకొన్న విశేషణములు చెలఁగఁ బరికరం, బై కృతుల వెలయుచుండు" కా. సం. 'రమణీ రమణీయ' యమకాలంకారము. 'సాయక-సాయక-వేశ-సోమేశా' అంత్యానుప్రాసాలంకారము.

తా॥ సంపద్వ్యక్తయగు లక్ష్మీదేవియొక్క యాలింగనమునందిచ్ఛగల విష్ణుమూర్తియే బాణముగాఁగలవాఁడవును, మన్మథుని సంహరించినవాఁడవును, అధిక దయామయుఁడవును, అయిన యో కందుకూసోమేశ్వరస్వామీ.

తే॥ అవధరింపుము తత్త్వవి ♦ ద్యావివేక, దళితకామాదిరిపువర్గ ♦ కలహుఁడైన
పురుహుఁ డొక్కని పల్కె నా ♦ భూవరేణ్య, శేఖరునితోడ వాక్యమై ♦ చిత్ర మెలయ. 2

అ॥ అవధరింపుము — వినుము, తత్త్వ.....హుఁడు. తత్త్వవిద్యా — వేదాంతశాస్త్రమునందలి, వివేక — జ్ఞానముచేత, దళిత — భేదింపఁబడిన, కామాది — కామము మొదలగు, రిపువర్గ — అరిషడ్వర్గముయొక్క, అనఁగాఁ గామ క్రోధ లోభ మోహ మదమత్సరములయొక్క యనుట. కలహుఁడు — పరస్పర వివాదముగలవాఁడు, 'ని. అస్త్రీ ద్యూతం సమరాభీకరణాః కలహో విగ్రహాః' అ,

ఐన పులహుఁడు — అయినటువంటి పులహుఁడను నామధేయముగల బ్రహ్మ, ఆ భూవరేణ్యశేఖరుని తోడన్ — రాజులలో శ్రేష్ఠుఁడయిన యోగశర్మశీలునితో, వాక్యవైచిత్రి మెఱయన్. వాక్య — మాటల యొక్క, వైచిత్రి — ఆశ్చర్యము, మెఱయన్ — ప్రకాశించఁగా, ఇట్లని — ఈవిధముగాఁ జెప్పఁదగినది ముగా, పల్కెన్ — చెప్పెను, ఇందు 'కలహుఁడు — పులహుఁడను, అనుప్రాసాలంకారము.

తా॥ వేదాంతవిద్యాజ్ఞానసమృద్ధిచేతఁ గామక్రోధ లోభ మోహ మదమాత్సర్యములను నరిషడ్వర్గము జయించినవాఁడయిన పులహుఁడు శ్రేష్ఠుఁడయిన యోగశర్మశీలభూపాలునకు నీవిధముగాఁ జెప్ప నారంభించెను.

క॥ ఆరీతి నతఁడు దివిజస్త్రీతిలకంబుతోడ ♦ ననువుగ సురతా
పారవ్యాపారశ్రీ, పారగభావమున భ్రాంతి ♦ పడి వర్తించుచున్. 3

అ॥ అతఁడు — ఆనిరంకుశుఁడు, ఆరీతిన్ — ఆప్రకారముగా, దివిజస్త్రీతిలకంబుతోడన్ — దివిజస్త్రీ — దేవతాస్త్రీలలో, తిలకంబుతోడన్ — ప్రకాశించుచున్నట్టి యొకరంభతోఁగూడి, తిలకము శ్రేష్ఠవాచకము. అనువుగన్, తగినట్లుగా, సురతా......మునన్, సురత — సంభోగము యొక్క, అపార — ఆవలిదరిలేని - అంతములేని, వ్యాపార — ప్రవర్తనముయొక్క, శ్రీ-సంపదయొక్క, పారగ — ఆవలిదరిఁజేర పంచరించుచున్నట్టి, తుదముట్టనిచ్చుచున్నట్టి, భావమునన్ — అభిప్రాయముతో 'ని. భావస్సత్తాభిభావ్యాభిప్రాయచేష్టాత్మజన్మసు' అ. భ్రాంతిపడి — భ్రమించినవాఁడై, వర్తించుచున్ — ప్రవర్తించుచు, ఇందు 'అపారవ్యాపారశ్రీపారగ' అని రేఫము పలుమారు చర్చింపఁబడుటచేత వృత్త్యనుప్రాసాలంకారము.

తా॥ ఆ నిరంకుశుఁడావిధముగా సురకాంతతోఁ గలసి యొకతెగని సంభోగవాంఛతోఁగూడిన భ్రమగలవాఁడై ప్రవర్తించుచు.

వ॥ ఒక్కనాఁడు తనతోఁ గ్రీడింపఁ ద్రిదివంబున నుండి వచ్చిన యచ్చరలేమయుం దానును విలాసార్థంబుగఁ బురంబు వెడలి. 4

అ॥ ఒక్కనాఁడు — ఒకదినమున, తనతోడన్ — తనతోఁగూడి, క్రీడింపన్ — విహరించుటకు, త్రిదివంబుననుండి — దేవలోకమునుండి, ఇచట సవర్ణకము నుగూర్చి "సూ. ఉండిపదంబు పంచమ్యర్థంబగుచో పలనకందు వర్ణకమట్లు నవర్ణకంబునగు" ప్రౌ. వ్యా. ఉదా 'క. సనత్కుమారుఁడు మహీశా కిం, జనుదెంచె బ్రహ్మలోకంబుననుండి' భాగ. వచ్చిన + అచ్చరలేమయున్ — ఏతెంచిన యప్సరోంగనయును, తానును — ఆనిరంకుశుఁడును, విలాసార్థంబుగన్ — స్త్రీపురుషులయొక్క శృంగారచేష్టల నిమిత్తము, 'ని. విలాసో హావభేదేస్యాత్. లీలాయామపి పుంస్యయమ్' మే. 'అర్థోభిధేయరైవస్తు ప్రయోజననివృత్తిషు' అ. పురంబువెడలి — ఆపట్టణమునుండి బయలుదేఱి,

—: రంభానిరంకుశులు ఉద్యానవనమునకుం జేరుట :—

సీ॥ సరసీరుహానవీన ♦ తరసీధురసపాన, భసలసుందరగాన ♦ భాసమాన
మసమానసహకార ♦ లసమానఫలవార, ససమాదరకుమార ♦ సముదకీర
మవనాదరణదార ♦ పవనాలసవిహార, భవనాగవిస్ఫార ♦ భవ్యహార
మవమానలవదూర ♦ పవమానసంచార, భవమాంద్యవిస్తార ♦ ఫణివిహార

తే॥ మంచితవిహంగమము రాజ ♦ హంసచంచు, దళితఫలసారజలపూర ♦ మిళితఫలిత
కలితఘనశాలినవశాలి ♦ ఖండమండ, లావరణదీవ్యమానము ♦ ద్యాన మొకటి. 5

అ॥ సరసీ.....మానము. సరసీరుహ — తామరపువ్వులయొక్క, నవీనతర — నూతనమయిన, క్రొత్తదియైన, సీధురస— మద్యమును, 'ని, మధ్వాసవో మాధవకో. మధుమాధ్వీకమద్యయోః, మైరేయమాసవఃసీధు. ర్మేదకో జగలఃసమా' అ మధ్వాసవః-మాధవకః-మధు-మాధ్వీక. ఇవి మధుకపుష్పోద్భవమద్యమునకును, మైరేయం-ఆసవః-సీధుః. ఇవి యిక్షుశాకాదిజన్యమద్యమునకును, మేదకః-జగలః- ఇవి సురాకల్కమునకును, అర్థములు. ఇచట 'సీధుః-శీధుః' అని రెండురూపములు కలవు. 'ని. మదిరా మధుమైరేయం శీధుఃకాదంబరీత్వీరా' ధనం. పాన — ఆస్వాదించుచున్న, భసల — తుమ్మెదలయొక్క, సుందరగాన — చక్కనిసంగీతముచేత, భాసమానము— ప్రకాశించుచున్నదానిని, అసమా... కీరము. అసమాన — సమానములేని, సహకార — మిక్కిలి పరిమళముగల తీయమామిడిచెట్లయందు 'ని. సహకారోఽతిసౌరభః' అ. లసమాన — ఒప్పుచున్న, ఫలవార — పండ్లయొక్క సమూహాముచేత, ససమాదర — సన్మానముతో సహితమయిన, కుమార — ఎలప్రాయముగల, సముదకీరము — సంతోషముతోంగూడిన చిలుకలుగలదానిని, "ని. ముత్ప్రీతిః ప్రమదోహర్షః ప్రమోదామోదసమ్మదాః" అ. అవ...హారము. అవనాదరణ — అవనియందు గౌరవింపంబడనిదయిన, అనంగా నతిశయింపనిదైనయనుట. దార — చీల్చుచుండెడు, 'దౄ. విదారణే, ధాతువు, పవన — వాయువువలన, అలస — మాంద్యముతోంగూడిన స్వభావముతో, విహార — సంచరించుచున్నవారికి, భవన — ఇండ్లు గాంగల, 'ని. భవనాగారమందిరమ్' అ. అగ — వృక్షములయొక్క, వ్యు. నగచ్ఛతీత్యగః. 'ని. శైలవృక్షౌనగావగౌ' అ. విస్ఫార — విశాలమయిన, భవ్య — శుభకరమయినట్టి, హారము- మనోహరమయినదానిని, వ్యు. 'హ్రియతే చిత్తమనేనహారః' అవ.....విహారము. అవమాన — తిరస్కరింపంబడి, లవ — లేశములైన, తునకలయిన, దూర — దవ్వుగల, పవమాన — వాయువులయొక్క, 'ని. నభస్వద్వాత పవన పవమాన ప్రభంజనాః, అ. సంచార — తిరుగుటవలన, భవ — పుట్టిన, 'ని. భవస్సత్తారుద్రగర్భ ప్రాప్తిసంసారజన్మసు' నానా. మాంద్య — జడత్వముచేత, విస్తార — ఎక్కువయైన, ఫణి — సర్పములయొక్క, 'ని. కుండలీ గూఢపాచ్చక్షుశ్శ్రవాః కాకోదరఃఫణీ'. అ. విహారము — సంచారముగలదానిని, 'ని. విహారోభ్రమణేస్కంధే లీలాయాంసుగతాలయే'. మే. అంచిత — ఒప్పుచున్న, విహంగమము — పక్షులుగలిగినదానిని, 'ని. ఖగేవిహంగ విహగ విహంగమ విహాయసః' అ. రాజ...మానము, రాజహంస — ఎఱ్ఱని కాళ్లును ముక్కును గలిగి తెల్లగానుండెడు రాయంచలయొక్క, "ని. రాజహంసస్తుతేచంచు చరణైర్లోహితైస్సితాః" అ. చంచు — ముక్కులచేత, "ని. చంచుస్త్రోటిరుభేస్త్రియామ్" అ. దళిత — ఛేదించంబడిన, ఫల — పండ్లయొక్క, సారజల—రసముచేతను

లోపకా వర్ణకస్యాత్రకధితా క్వచిత్సుకవిసమ్మతేః' అథ. ముమ్మరంబుగన్ — అధికముగా, పూఁదేనె — పుష్పములయందుఁగల మకరందరసముయొక్క, ఇచట 'పూఁదేనె' అనుటకు 'నూత్నశబ్దానామాదిభాగేషు నూతనత్వాదిబోధకాః ఏకద్విత్ర్యక్షరశబ్దాస్స్యు రర్థశేషేఽపిచక్వచిత్" అథ. ముసురు — ఎడతెగని వర్షము, కురియన్ — వర్షించఁగా, అచ్ఛతర — తెల్లనివయిన, గుచ్ఛములమీఁదన్ — పూగుత్తులపైన, అళులు — తుమ్మెదలు, క్రమ్మన్ — వ్యాపింపఁగా, దెప్పరంబు — అశక్యము, అగు లేఁవీఁగె — అయి నట్టి లేఁతతీఁగలయొక్క, చప్పరమునన్ — చలిపందిరియందు, ఇందు 'అచ్ఛ గుచ్ఛ' అనుప్రాసాలంకారము. 'పూఁదేనెముసురుగురియ' ననుటచే నతిశయోక్త్యలంకారము.

తా॥ చూచి యచ్చటఁ గలవిశేషముల కచ్చెరువందుచు నెడతెగక కురియుచున్న పూఁదేనె సోనలకు పైఁపఁ జాలక తెల్లని పూఁగుత్తులమీఁద వ్యాపించిన తుమ్మెదలతో నతిశయించియున్న యొక లేఁతతీఁగెలుంగల చలిపందిరియందు.

—: రంభా నిరంకుశుల సురతకేళీవర్ణనము :—

సీ॥ వదనచత్వర విసృ • త్వరరసజ్ఞారవో, న్నిద్రతాదికూల • ముద్రుజంబుఁ
గనకకంకణఝణ • త్కారసముత్పాత, పంచాంగుళప్రియం • భావుకంబు
మధురాధరోష్ఠస • మంతాన్నిపీడనా, ద్ధత్యానుకంపామి • తంపచంబు.
సజ్ఞానపూర్వర • త్యోన్నత్య పునరుప, క్రమణయాచ్ఞావచో • భ్రంలిహంబు
తే॥ గాఁగ సురతంబు సల్పి య • క్కమలముఖియు, నామహీసురసూనుండు • నంతఁ జాల
నలసి వేఁఝుతిదివ్యాంగ • నామృతాంగు, లగుచుఁ దమచేతలకుఁ దామె • నగుచునుండి. 7

అ॥ వదన...బంబుగ్. వదన — ముఖముయొక్క, చత్వర — ముంగిలియందు, "ని. చత్వరం స్థండిలేంగణే" విశ్వ. విసృత్వర — ప్రసరించుచున్న, "ని. విసృత్వరో విసృమరః ప్రసారీచ విసారిణి" అ. రస — అమృతమును, "ని. శృంగారముఖ్యమధురాది సువర్ణరేతో, నిర్యాస రాగ గరళ ద్రవ పారదేషు, ఆస్వాదనధ్వని సుఖాంబురసాఖ్యధాతు, ష్విష్టో రసోఽధరసనా ధరణీ రసా స్యాత్" నానా. జ్ఞ — తెలియజేయఁజేయునట్టి, ఆరవ — రతికాలమునందు గొంతునఁ గలిగెడు గుబగుబ యను ధ్వనివలన, ఉన్నిద్రతా — మేలుకొనియుండుట, జాగరూకత గలిగియుండుట. ఇచట 'ఉన్నిద్రతా' అనుటకు 'సూ. త్వతలోః గుణవచనస్య, సిద్ధాం. వ్యా. శుక్లాయాభావః శుక్లత్వం. శుక్లతా. త్వ లో రితి, త్వప్రత్యయే తల్ప్రత్యయే చ పరే గుణోపసర్జనద్రవ్యవాచినః పుంవత్త్వం వక్తవ్య మిత్యర్థః. దికూలముద్రుజంబున్ — దిశలయొక్క దరులనొరయునదియును, అనఁగా దిగంతముల వఱకు వినికిడి గల కంఠధ్వని యనుట. కూలముద్రుజ మనునది యేకపదము 'కూల ముద్రుజ తీతి కూలముద్రుజః' 'సూ. ఉది కూలే రుజి వహోః' ఇతిఖచో 'అరుర్ద్విషః' దిత్యాది నాముమాగమః. 'ఉదా. ఉర్వ్యాః సరిద్వారినకూలముద్రుజమ్' రావ. "సరితాం కూలముద్రుజాః", రఘు. "దికూలముద్రుజాటోపాః" ప్రతా. కనక...కంబున్, కనకకంకణ — సువర్ణమయములైన హస్తాభరణములయొక్క, ఝణత్కార — ఝణఝణయనెడి ధ్వని చేయుచు. సముత్పాత — పైనఁబడుచున్న, సం + ఉత్ + పాత — సముత్పాత అని తెలియవలెను. పంచాంగుళ — హస్తములయొక్క, ప్రియంభావుకంబున్ — ఇష్టమును గలుగ[illegible]

చున్నదియును, అనఁగా నొండొరులపై హస్తములుంచఁబడుచున్నయట్టిట సుధ......చంబుల్, మధుర – తియ్యనైన, అధరోష్ఠ – క్రిందిపెదవియొక్క, సమంతాత్ – అంతయును, నిపీడన – బాధ పెట్టఁబడుచున్న; అనఁగా నధరామృతపానము సేయుచున్నయదట, ఔద్ధత్య – దుడుకుతనముచేతను. అతిశయముచేతను. అనుకంపా – దయచేతను, మితంపచంబుల్ – మితిగాపక్వమైనట్టియును, ఇచట 'మితంపచ' శబ్దమునుగూర్చి "సూ. పరిమాణేపచః" 'మితనఖేచ' సిద్ధాం. "ఉదా. ద్రోణంపచాస్త్రత మితంపచావా" రావ. అజ్ఞా.....లిహంబుల్. అజ్ఞాత – అల్పముగాఁ దెలియఁబడిన, "తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రశస్తిర్విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః" పూర్వరతి – ప్రథమసంభోగముయొక్క, ఔన్నత్య – అధికముచేత, అనఁగా మొదటికలయిక బొత్తిగాఁ దెలియకుండుటచే ననియర్థము. పునరుపక్రమణ – మరల నారంభించుటకు, యాచ్ఞా – అడుగుటయనెడు, వచో – వాక్యములయొక్క, అభ్రంలిహంబుల్ – ఆకాశము నాస్వాదించుట కలిగినట్టియును, అనఁగా బునస్సంగమమునకుఁ బ్రార్థించుచున్న మాటలయొక్క ధ్వని యాకసము నంటుచున్నదనుట. కాఁగన్ – అగునట్లుగా, సురతంబుసల్పి – సంపర్కముచేసి, అక్కమలముఖియున్ – పద్మమువంటిముఖము గలదయిన యారంభయును, ఇచట 'అక్కమలముఖి' అనుకుట "సూ. ఇదమదసేతద్యత్తచ్ఛబ్దాశ్చహ్రస్వాన్తరాన్వయే బహుళంహ్రస్వంప్రపద్య దీర్ఘాద్విత్వముపర్యక్షరస్యజనయంతి" నన్న. "ఊష్మరేఫాన్వినా ద్విత్వమయుక్తస్యహలోమతః, ఋకారంచవిముచ్యస్యాత్ ప్రాణానాంద్విత్వసంగతిః" అథ. అమహీసుర తనయుండున్ – బ్రాహ్మణునికొడుకయిన యానిరంకుశుఁడును, అంతన్ – అంతట, చాలన్ – అలసి – ఎక్కువగా బడలినవారై, వల......గులు. వలయిత – చుట్టును జుట్టఁబడిన, దివ్యాంబర – మనోహరమయిన వస్త్రములచేత, ఆవృత – ఆవరింపఁబడిన, చుట్టుకొనఁబడిన, అంగులు – శరీరము గలవారు, అగుచున్ – అయి, తమచేఁతలకున్ – ఆయిరువురు చేసినపనులకు, తామె – వారంతట వారె, నగుచునుండి – నవ్వుకొనుచునుండి, ఇందు 'వదన...జంబు' 'పునరుప...లిహంబు' అనుక్తవిషయస్వరూపోత్ప్రేక్ష. "క. ఫలతను హేతుత వస్తుత, నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్, తొలిరెండును సదసద్విష, యలు కథితాకథితవిషయ యంతిమయు నగున్" అలం. సా. సం. ఈపద్యమంత్యానుప్రాసముతోఁ జెప్పఁబడినది. ఉదాత్తాల కారమును. "ఉదాత్తం వస్తుతః సంపత్, మహతాం చోపలక్షణమ్" కా. ప్ర. 'ఉత్సాహభావమును. క. అత్యున్నతలోకోత్తర, కృత్యంబులు సేయ వేఁడి కృతకృత్యు విలన్, నిత్యముఁ దలఁచు ప్రయత్నం, బత్యంతోత్సాహ మయ్యె" కా. సం. "వదన...జంబు" ఇత్యాదులచే సంభోగావస్థ వర్ణింపఁబడియున్నది. "అనుకూలే నిషేవేతే. యత్రాన్యోన్యం విలాసినౌ, దర్శనస్పర్శనాదీని స సంభోగఉదాహృతః" ఉదా. త్వం ముగ్ధాక్షి వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీం, లక్ష్మీమిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి, శయ్యోపాంత నివిష్టసస్మితసఖీనేత్రోత్సవానందితో, నిర్యాతః శనకై రలీకవచనోపన్యాస మాలీజనః" అమరు. "గాఢాలింగన పీడనస్తనతటంస్విన్నోద్గతస్వేదస్థలం, సందష్టాధరముక్తసీత్కృత మభిభ్రాంతభ్రునృత్యత్కరం, చాటుప్రాయవచో విచిత్రమణితం ఘాతై [illegible] ప్రాప్నోతి ధన్యోరతమ్" శృం. తి. రంభానిరంకుశులు సంభోగముచే నలసియుండి రనుటకు [illegible] ఒకనాఁ డాప్రమాంకురొఘం బురుకుసుమ [illegible] దరక్షోణితల్ప ప్రకరంబై కాంతు చేము నృతులఁ బదరి [illegible] మున్నట్లయానా, యికలం గందర్ప డోటం బెటిఁగితమివీఁ పెసనానంటి [illegible]

"ఈషత్కాంపపయోధరం గురుకటీ ప్రౌఢ ప్రహారాద్భుతం, స్విద్యత్ఫాలమనేక హాస్యసరసం సంకథ్యష్ఠాదవ్యసకం, వారంవారముపాత్త సుభగం సందంశ్యమానాధరం, కించిద్దత్తనితంబబద్ధ శనఖరం గుస్యోరతం సేవ్యతే" శాస్త్ర. ఈపద్యము పెద్దనామాత్యుని "సీ. సహసానఖంపచ స్తనదస్త్ర పర్యంథి" యను పద్యము వలె నుండలేదని యొకరనిరి. శ్రీనాథుని "సీ. పతిపాణిపల్లవ♦చ్యుతనీవిబంధన, వ్యగ్రి బాలా హస్త♦పనిషూహంబు" అను పద్యము ననుసరించియే యెక్కుడనిరి విమర్శకులు, పెద్దన్నగారును, ఆంధ్రబిల్హణుడగు చంచత్కేరిక వులును బొక్కటి సీసములు రచించి ఉన్నారు లోకవిదితము. ఇందుచ్ఛన్దస్త్రీ. యాశ్వాసమున 61 వ పద్యము వివరించు యొకపి యెంతటి రసవత్తరముగా వ్రాయఁగలిగిరిన్ మనకుఁ దెలిసియేయున్నది.

తా॥ ముఖమునుండి వ్యాపించుచున్న యమృతమును దెలియఁజేయుచున్న రతికాలమున గొంతునఁ గలిగెడు గుబగుబధ్వనివలన జాగరూకత వహించియున్న దిగంతములు గలదియును, కాంచనమయము లగు హస్తాభరణములయొక్క ఝణఝణయనెడు ధ్వనులతో నొండొరులపైఁ బడుచున్న హస్తములవలన స్నేహమును బుట్టించుచున్నదియును, తీయని యధరామృతపానము నెక్కువగాఁ జేయుటవలనఁ గనికరముతోఁ గూడి మిక్కిలి సక్తమైన మోవిగలదియును, ప్రథమసంభోగాతిశయము బాగుగాఁ దెలియకయుండుటచేత మరల నారంభించుటకుఁ బ్రార్థించుచున్న పలుకులయొక్క ధ్వని యాకసము నంటుచున్నదియును, అయిన సంభోగమును జేసె యారంభయును నిరంతరుఁడును జాలక్రమ నొంది యందమైన తమవస్త్రములను మొలచుట్టుఁ జుట్టుకొని యాయిరువురు చేసినపనులకుఁ దమలోఁ దామే నవ్వుకొనుచుండిరి.

ఉ॥ జాఱినకుంతలంబులు పొ♦సంగఁగ దువ్వుచుఁ జల్వపయ్యెదన్
దోరపుఘర్మబిందువులు ♦ దూలఁగ వీవుచు వీడియంపుఁ గ
ప్పూరపువాసనల్ దిశలఁ ♦ బొల్పడ నించి మనోభవాహవో
దారకళావిశారదుఁడ ♦ వౌ మను రాయని తన్ను మెచ్చుచోన్

అ॥ జాఱినకుంతలంబులు — ముడివీడినతలవెండ్రుకలు, "ని. చికురః కుంతలో వాలః కచః కేశః శిరోరుహః" అను. పొసంగఁగన్ — ఒప్పునట్లుగా, దువ్వుచున్ — నున్నఁగాదువ్వికొనుచు, చల్వ పయ్యెదన్ — ధౌతవస్త్రముయొక్క మైజాఱున, దోరపుఘర్మబిందువులు — అధికమయిన చెమట బొట్లు, "ని. ఘర్మో నిదాఘః స్వేదః" అ. దూలఁగన్ — చలించునట్లు, వీవుచున్ — విసరికొనుచు, అనఁగాఁ జెమట యాఱునట్లు విసరికొనుచుననుట, వీడియంపుఁ గప్పూరపువాసనల్ — తాంబూలముయొక్క కప్పురముతోఁ గూడిన పరిమళము, ఇచట "వీడియంపుఁ గప్పురపు" అనుచోట్లఁ బుగాగమమును గూర్చి "సూ. సామానాధికరణ్యేతు ♦ బహుత్వాశ్లేపరేఽపిచ, ముబ్యోర్భవేతాం పుంప్యాఖ్యావాదే శావక్రేసర్వదా" అథ. దిశలన్ — దిక్కులయందు, పొల్పడన్ — వ్యాపింపఁగా, నించి — నిండింపఁ జేసి, మనో......దవు. మనోభవ + ఆహవ — మన్మథునియొక్క సంగరమునందు — సంభోగమునందు, ఉదార — అధికమయిన, "ని. ఉదారో దాతృమహతో" అ. "ఉద్ధా. "ఉదారమతయః" షడ్. బిల్హ. "ఉదారకీర్తేః" కిరా. కళా — విద్యయందు, "ని కలా స్యా న్మూలవై వృద్ధౌ శిల్పాదా వంశ

సీ॥ కారుణ్యరసవృష్టిఁ • గమనీయతనుయష్టి, చిగిరించెనా జటా • శ్రీ దలిర్ప
నమృతఘనీభావ • మనఁగ నొప్పువిభూతి, ధవళితాంగరుచి • దివిఁ జెలంగ
హస్తాంబుజంబుపై • నాడుమట్పదపరం, పర నాఁగ రుద్రాక్ష • మాల దనర
సముదంచితానంద • జలధి ఘూర్ణిలుమాడ్కి, మారుతాహతిచేత • మహతి మ్రోయఁ
తే. బ్రకటతేజోవిశేషంబు • బాలసూర్య, సృష్టి గావింప నయనసం • తుష్టి గాఁగ
నరుగుదెంచుచున్నవాఁ • డభ్రవీథి, నీశుఁ డెవ్వాఁడు గిరిజపూ • ర్ణేందువదన. 10

అ॥ గిరిజపూర్ణేందువదన — నిండుచందమామవంటి మోముగల యో దేవతాకాంతా, కారుణ్యరసవృష్టిన్, దయారసముయొక్క వర్షముచేత, దయ యనెడు జలముచేత ననియుఁ జెప్పవచ్చును. ఇచట 'కారుణ్యరస' మనుటకు "సీ. కరుణారసముపొంగి తొంగెడుచూపున, శశిరేఖవమృతంబుజాలుం వారి" భార. రసశబ్దమునుగూర్చి 'ని. శృంగారాదౌ కషాయాదౌ • ఘృతాదావవిషే జలే, నిర్యాసే పారదే ధాతౌ వీర్యేచ రస ఇష్యతే' ధనం. "గుణేరాగేద్రవేరసః" అమర. కమనీయతనుయష్టి — ఇంపైన దండమువంటి దేహము, అనఁగా గట్టువంటి మేనును. చిగిరించెనాన్ — పల్లవించెనేమో యనునట్లు జటాశ్రీ — జడలయొక్క సంపద, తలిర్పన్ — అతిశయించ గా, అమృతఘనీభావము — సుధయొక్క గడ్డకట్టుట, అనఁగన్ — అనునట్లుగా, ఇచట అమృతశబ్దమునుగూర్చి 'ని. పీయూష మమృతం సుధా' అ. ఒప్పువిభూతి — ప్రకాశించుచున్న భస్మముచేత, ధవళిత — తెల్లనయియున్న, అంగరుచి — శరీరముయొక్క కాంతి, దివిన్ — ఆకాశమునందు, చెలంగన్ — ఒప్పఁగా, హస్తాంబుజంబుపైన్ — తామరపూవువంటి చేతిమీఁద, ఆడుమట్పదపరంపర — వర్తించుచున్న తుమ్మెదలయొక్క పరంపరయో నాఁగన్ — అనునట్లు, రుద్రాక్షమాల — రుద్రాక్షలతోఁ గూడినజపమాలిక, తనరన్ — ప్రకాశింపఁగా, సముదంచితానందజలధి, సముదంచిత — ఒప్పుచున్న, ఆనందజలధి — సంతోషమనెడుసముద్రము, ఘూర్ణిలుమాడ్కిన్ — ధ్వనిచేయునట్లవలె, అనఁగా సముద్రపుమ్రోతవలె ననుట. మారుతాహతిచేతన్ — వాయువులయొక్క తాఁకుడుచేత, మహతి — నూఱుతంత్రులు గలదయిన తనయొక్క వీణ, 'ని. వీణాభేదేఽపి మహతీ' అ. మ్రోయన్ — మ్రోగుచుండఁగా, ఇచట నారదునివీణ మహతియనుటకు 'ని. విశ్వావసోస్తు బృహతీ. తుంబురోస్తు కళావతీ, మహతీ నారదస్య స్యాత్, సరస్వత్యాస్తు కచ్ఛపీ' వైజ. ప్రకటతేజోవిశేషంబు. ప్రకట — స్పష్టమయిన, తేజోవిశేషంబు — దీప్తియొక్క యతిశయము, బాలసూర్యసృష్టిగావింపన్. బాలసూర్య — ఉదయించుచున్నట్టి సూర్యునియొక్క, సృష్టి — పుట్టుకను, గావింపన్ — కలుగఁజేయ గా, నయనసంతుష్టి. నయన — కన్నులకు, సంతుష్టి — ఆనందము, గాఁగన్ — కలుగఁగా, అభ్రవీథిన్ — ఆకాశమార్గమున, 'ని. ద్యోదివౌ ద్వే స్త్రియా మభ్రం వ్యోమ పుష్కర మంబరమ్' అ. అరుగుదెంచుచున్నవాఁడు — వచ్చుచున్నవాఁడు, ఈశుఁడెవ్వాఁడు — ఈపురుషుఁడెవ్వరైయుండును, ఇచట 'ఈశుఁడు' విశేష్యము ఉద్దేశ్యము 'ఎవ్వాఁడు' విధేయము. 'సూ. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విశేష్యంబు' ప్రౌ. వ్యా. 'ప్రకటతేజోవిశేషంబు బాలసూర్యసృష్టి గావింప' ఉపమాలంకారము. పద్యమంతయు ముత్ప్రేక్షాలంకారము. "సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య పరేణయత్" కా. ప్ర. 'ఆనందజలధి-హస్తాంబుజము' రూపకాలంకారము. 'వృష్టి యష్టి' అనుప్రాసాలంకారము.

క్రూరత్వమును, చూపఁగాన్ — కనపఱచుట, తగునె — చెల్లునా, చెల్లవనుట, ఇందు 'ఉండీనుండనీ' అను ప్రయోగమునకు 'సూ. ప్రార్థనాదులం దప్రత్యయాంతక్రియలమీఁ దియిమ్మ కీకారంబు విభాష నగు' ప్రౌఢవ్యా. ఉదా. 'మ. మునిధర్మంబుల కెల్లవ ప్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ' కళా. 'సూ. పునరుక్తి ర్థారణావ్యగ్రాత్వేప్సావిశిష్టే నవ్యక్తాత్' అథ. 'ఉండీనుండనీ - గాకమాకయోఁ-వేళీలోలయై, అనుప్రాసాలంకారము.

తా॥ భోగలాలసుఁడై యుఁడెను చెంతనుండినమానె. దుర్మార్గమనిన నిదియేకదా! ఇంతటనైనను దుర్బుద్ధిగలదియను లోకనిందను పొందక మావంటి మహాత్ములను నమస్కరింపగూడదా! పాపము వీనిగతి యేమి కానున్నదో అదియును వాఁడును వచ్చు మహాత్ముల మగు మావంటివారి యెడల తను చెడుబుద్ధి విశేషమునునట్లు కపటకృత్యములతోఁ బ్రవర్తింపఁ దగునా.

## —: నారదుఁడు దేవలోకమున కేగుట :—

శా॥ కానీ దీనికిఁగా నొకానొకప్రసం♦గం బింద్రునొద్దన్ వచో
నూనప్రౌఢిమఁ జెప్పి కొంతకలహం♦బుం బెంచఁ జోటుండఁగా
నానాభూములకేగనేటికి వృథా♦ నాకంబుచేరఁ జనం
గా నిట్టిప్పుడె వేళయంచు జనియె♦ న్గౌతూహలాభ్యున్నతిన్. 16

అ॥ కానీ — అయినయగానిమ్ము. సరేమంచిదిలే. భేదించుటను దెలియజేయును. 'ని. గీ. కాని కానీయనంగ వికల్పమునకు, నెదుటి వాగ్విరుద్ధమునకు' ఆం. ప. ని. 'సూ. ప్రార్థనాదులయందు ఇమ్మనకు ఈవిభాషనగు' బా. వ్యా. ఉదా. ద్వి "ఆనందమకులకాంతి♦యరుదెంచి కాంచి,కాని కానీ పోదు గాని లెమ్మనుచు, నొఱపైనతనకేల♦నొకకోలఁబూని, తలుమబిత్తరము త♦త్తరమురెట్టింప" అప్ప. దీనికి గాన్ — ఇందునిమిత్తమై, ఇంద్రునొద్దన్ — ఇంద్రుని సమీపమున, ఒకానొకప్రసంగంబు—యేదియో యొకప్రస్తావన, వచోనూనప్రౌఢిమన్—వచో — వాక్కులయొక్క, నూన — నిశ్చయమైన, 'ని.నూన మవశ్యం నిశ్చయే ద్వయం' అను. ప్రౌఢిమన్ — నేర్పుతో, ఈప్రౌఢిమశబ్దమునుగూర్చి ద్వి. 4 వ పద్యమునఁ జెప్పబడియున్నది. చెప్పి — బోధించి, కొంతకలహంబున్— కొంతకయ్యమును, పెంచన్— వృద్ధిచేయుటకు, చోటుండఁగాన్ — తావుండగా— తగినసమయముండగా, నానాభూములకున్— అనేకస్థలములకు, 'ని. నానా నేకోభయార్థయోః' అని. అ. ఏగనేటికిన్ — పోవుటయెందులకు, వృథా — వ్యర్థము, 'ని. వృథానిరర్థకావిధ్యో' అను. ఇచట నవ్యయప్రయోగమునుగూర్చి 'వ్యా. ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః క్వచిద్భవేత్' అథ. దీర్ఘాంతమునుగూర్చి 'సూ అవ్యయస్యే తరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా కథిత స్తద్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' అథ. నాకంబు చేరన్ — స్వర్గంబునకు సమీపించుటకు, చనంగాన్ — పోవుటకు, ఇట్టిప్పుడె — ఇటువంటిసమయమునన్, వేళ — మంచియదను, ఉచితసమయము, అంచున్ — అనుకొనుచు, కౌతూహల — కోరికయొక్క, అభ్యున్నతిన్ — అతిశయముతో, చనియెన్ — పోయెను, ఈపద్యమున ఇట్టిప్పుడె అని ప్రయోగించుటకు సూ. 'క్వచిత్ సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్ర చ్యుతోభవేత్' అథ. 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' ప్రౌఢవ్యా. ఉదా. 'మ. తెలి చిట్టంబుధినాథనందనులు

ఈపద్యమున 'నన్ను జేర్కొంటివి' అనుటకు 'సూ. వర్ణాగమోవిశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు' శబ్దచిం. నీవు జేర్కొనుటచే మనకుకష్టము సంభవించు ననుహేతువుచేఁ గావ్యలింగము, 'కావ్యలింగం హేతోర్వాక్య పదార్థతా' కా. ప్ర.

తా॥ ఓయీ! ఎక్కడనుండివచ్చితివి. నీకుఁ గొంచెమైననుదెలియదే నీమతియేమైనది? నాలుక మీఁద నువ్వుగింజ నానుసంతటి కాలమైనను నిదానమును గుట్టునులేని మిక్కిలి మోసగాఁ డయిన నారదుఁ డాకసమునఁబోవుచుండఁగా నయ్యో నాపేరుతోఁబిలుచుచుంటివి. ఆతఁ డీమాట విని నట్లయిన మనకుఁ గష్టముగలుగదా.

క॥ ఆతఁడు విన్నప్పుడె పురు, హూతుఁడు వినుటయును బుద్ధి ♦ నూహింపు శచీ
నేత వినెనేని వెతయగు, చేఁతయె కా తెలిసికొనుము ♦ సిద్ధము గాఁగన్. 19

అ॥ బుద్ధిన్ — నీమనసునందు, ఊహింపు — తర్కింపుము, ఇచట మువర్ణలోపమునకు 'సూ. ప్రార్థనార్థే మురేకత్వేకధ్యయేమధ్యమార్థకః, విభాషాంతెంవదంత్యేకే, నప్రాణేతుకదాచన' అధ. ఆతఁడు — ఆనారదుఁడు, విన్నప్పుడె — వినినకాలముననె, పురుహూతుఁడు — ఇంద్రుఁడు, వినుటయును — ఆలకించుటయును, ఇచటఁగ్రియాన్వయ వాక్యంబు నవ్యంగ్యముద్యోతకంబగుటకు 'సూ. క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబులగు' ప్రౌ. వ్యా. శచీనేత — శచీదేవికి భర్తయగు నాయింద్రుఁడు, వినెనేని — ఆకర్ణించినట్లయిన, వెతయగు చేఁతయకా. కష్టముకలుగునట్టి, పనియే కదా ఇచటను వ్యంగ్యార్థద్యోతకముకలదు. 'చేఁతయకా' అనుటకు సూ. 'అకానిత్యర్థకంబగు' ప్రౌ. వ్యా. ఉదా. అపజయము కాలక్షింపి, భార. సిద్ధముగాఁగన్ — నిక్కముగా, తెలిసికొనుము — ఎఱుంగుము, ఇందు రంభయొక్క పరకీయనాయికాత్వము సెప్పఁబడినది. 'క. అన్యయనఁగ నన్యోఢయు' అనిచంద్రా. అని నరస. అలం. అక్రమాతిశయోక్తి "అక్రమాతిశయోక్తి స్స్యాత్ సహత్వే హేతుకార్యయోః" అనిచంద్రా. ఈపద్యమున విషాద మను భావముచెప్పఁబడినది.

తా॥ ఆతఁడు వినఁగానే యింద్రునకుఁజెప్పను. ఇంద్రుని చెవిఁబడెనేని కష్టముగలుగు పనియే కదా! రూఢిగాఁ దెలిసికొనుము.

గీ॥ మనము చేసినసుకృతసం ♦ పద నతండు, వినక పోయిన బ్రదికితి ♦ మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు ♦ వెదకుఁ గాని, మాని పెట్టినతంత్రంబుఁ ♦ గానలేఁడు. 20

అ॥ అనఘవర్య — పుణ్యపురుషుఁడవైన యోనిరంకుశుఁడా, మనము — మనమిరువురము, ఇచట 'సూ. ఉభయార్థే భవేదత్వమర్థభేదేక్వచిన్నతత్' అధ. 'సూ. భూయఉభయార్థవాచీయః కశ్చిద్భవతి నిత్యబహువచనః తస్యజనోముశసోల' శబ్దచిం. చేసిన సుకృతసంపదన్ — పూర్వముచేసికొనిన, పుణ్యముయొక్క యతిశయముచేత, అతఁడు — ఆనారదుఁడు, వినకపోయినన్ — వినకుండవెళ్లినట్లయిన, బ్రతికితిమి — సుఖముగాజీవించుదుము, విన్నయప్పుడె — వినినకాలముననే, ఒకకీడువెదకున్ — ఒక్కచేటును గలుగఁజేయుట కాలోచించును, కాని — అయినప్పటికిని, మాని — అఋషి — పెట్టినతంత్రంబున్ — పన్నినయుక్తిని, 'ని. తంత్రంకుటుంబకృత్యేస్యాత్సిద్ధాంతే చౌషధోత్తమే, ప్రధానేతంతు

వాయేచశాస్త్రభేదే పరిచ్ఛదే మే. కానలేఁడు — కనుగొనజాలఁడు, అనఁగా నారదుండెంతచెప్పిన నంతయే తప్పక జరుగునుట, ఇందు 'మనయదృష్టమువలన నామహర్షి వినకుండినచో మనము బ్రతుక గలము దురదృష్టవశమున నీపలు కతనిచెవిఁ బడినచోఁ గిష్టముతప్పదు' అనుటచే విషాదమనుసంచారి భావమువిస్పష్టమగుచున్నది. "విషాదశ్చేతసో భంగ ఉపాయాపాయచింతనైః" అనిప్రతా.

తా॥ మనయదృష్టపూర్వపుణ్యసాఫల్యంబున నతఁడు వినకుండ వెళ్లినేని బ్రతుకఁగలము. వినిన తోడనే యొకకీడు గలిగించ బ్రయత్నించును. అయిన నీవుపెప్పన్నగడల నాయింద్రుఁడు తెలిసి కొనలేఁడు.

—: ధర్మశీలుఁడు ప్రశ్నించుట :—

క॥ ఆమాట విని యొకించుక, భూమీపతి నవ్వి మౌని ♦ పుంగవ కరుణా
ధాముఁ డగు నారదునకే, భామామణి యింత యేల ♦ భయపడియె నొకో. 21

అ॥ ఆమాట—ఇట్లుచెప్పిన యాపులహునివాక్యమును, విని— ఆలకించి. భూమీపతి — భూమికిఁ బతియైన యారాజు, ఒకించుకనవ్వి — చిఱునవ్వునవ్వినవాఁడై, మౌనిపుంగవ — ఓ మునిశ్రేష్ఠుఁడా, కరుణాధాముఁడు — దయకునివాసమయినవాఁడు, అగు నారదునకే — అయినట్టి నారదమునినిమాచిన మాత్రమునకే, భామామణి — ఆరంభ, ఇంత — ఇంతగొప్పగా, ఏలభయపడియె నొకో — ఎందునకు భీతిఁజెందెనోకదా, అనఁగా నాతాపసునకుఁ గోపము లేదుగదా యింతలోనే యారంభ యేలభయ పడె ననుట, ఇందు హాస మనుభావము చెప్పఁబడినది 'వికృతి దర్శనాదిజన్యో మనోవికారో హాసః' ప్రతా.

వ॥ అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డిట్లనియె. 22

అ॥ అని — ఇట్లని, అడిగినధర్మశీలునకు—ప్రశ్నించిన ధర్మశీలుండను రాజునకు, పులహుఁడు— పులహుఁడను మహర్షి, ఇట్లనియెను — ఈప్రకారముగాఁ జెప్పెను.

—: పులహుని సమాధానము :—

సీ॥ దివిజకాంతామణి ♦ యవనీస్థలంబున, కరుదెంచు టపరాధ ♦ మౌన కాద?
అది మునుంగాక మో ♦ హావేశమున మర్త్యు, ననుభవించుట నేర ♦ మౌన కాద?
ఇంత మాత్రమె చాల ♦ కేప్రొద్దు వానికి, నమకూల యాటక ♦ ప్పౌన కాద?
అది కారణంబుగ ♦ నమరేంద్రు సేవకు, వరుగమి యాగడం ♦ బౌన కాద?
తే॥ చూడు మీ యెన్నివిధములఁ ♦ జూచికొన్న, రంభ యెడ దుండగమెధరా ♦ రమణవర్య
యది యెఱిఁగి చేరాదయ్యె ♦ నమరమౌని. కొండగానితనానకు ♦ గురువు గాన. 23

అ॥ ధరారమణవర్య — రాజులలోశ్రేష్ఠుఁడవైనవాఁడా, దివిజకాంతామణి — దేవలోకమున నుండెడియా వేశ్య, అవనీస్థలంబునకున్ — భూలోకమునకు, అరుదెంచుట — వచ్చుట, అపరాధము—

నేరము, కానకాద — అగునా కాదా, ఇదియొక నేరమనుట, అదియునుంగాక — అంతమాత్రమే
కాకుండ, మోహావేశమునన్ — మరులుకొనియొకలంజెయుంగవుండుటవలన, మర్త్యున్ — ఒకమానవునితోఁ
గూడి, అనుభవించుట — సంభోగసౌఖ్యములనుభవించుట. నేరము — తప్పు, కానకాద — అగునా
కాదా, ఇంతమాత్రమె నాగాలక — ఈయుపరాగమునఁ బాకుండ, ఏప్రొద్దున్ — ఎల్లప్పుడును. వానికిన్ —
అతనికి, అనుకూలయౌట — ఇష్టురాలగుట, తప్పు — దోషము, కానకాద — అగునాకాదా,
అనికారణంబుగన్ — ఆ హేతువువలన, అమరేంద్రసేవనన్ — దేవతాప్రభువగు నింద్రునిఁ గొలు
చుటకు, అరుగమి — పోకుండుట, ఆగడంబు — దుష్టత్వము, కానకాద — అగునాకాదా, ఇచట
'ఆగడము' అనుటకు "వ. అగణితముక్తాదామాభిరామంబై ప్రేమాస్పదంబగుచుం గందర్పకర
కంబు బిబ్బోకంబునాగడము సేయు కంఠసాధారంపర్యంబును" నార. ప్ర. చూచుచు — పరీక్షించుచు,
ఎన్నివిధములన్ — ఎన్నిరీతులచేత, చూచికొన్నన్ — పరిశీలించినను, దంభయోషన్ — ఆయప్సరస
యందు, దుండగమె — దుష్టత్వమే, (కలదు — ఉన్నది,) ఇదియధ్యాహారము; అడిరయెఱిఁగి — ఆ
నేరమును దెలిసికొని, కొండెగానితనానకునునువుగానన్. కొండెగానితనానకున్ — చాడీలుచెప్పునటు
వంటికార్యమునకు, ఇచట 'కొండెగాఁడతనము' అనుటకు "సూ. తనవర్ణకంబుపరంబగునిపుడు తచ్ఛబ్దా
ర్థమునకు లోపంబు విభాషనగు" ప్రౌ. వ్యా. ఉదా. "క. పె. ల్లాకొన్నతనాన" భీమ. గురువుగానన్ —
అధికుఁడైయుండెనుగనుక, అమరమునినిన్ — ఆదేవర్షిని, చేరరాదయ్యెన్ — సమీపమునకుఁ గూడ
రాదాయెనుగదా, ఈపద్యమంత్యానుప్రాసాలంకారము.

తా|| దివిజకాంత యింద్రునానతిచొప్పునఁ బ్రవర్తింపక భూలోకముననే కాపురముండు
టయు, నిరంతరుని వీనని ప్రేమతో వర్తించుటయు, సురసభకుఁ బోకుండుటయు, నేరములేకదా.
ఆకారణముననే నాగదునిఁ జూచి యంతటిభయమును జెందినది.

తే|| భూసురప్ర్వన కొకనాఁడ • పోయి కౌఁగి, లిచ్చి రమ్మని పంపినా • డింతె కాని
సంతతము వానితోఁ గేళి • సల్పుమనుచుఁ, బలిచెనే తన్ను లోకైక • భర్తయైన. 24

అ|| లోకైకభర్త. లోక — భువనములన్నిటికిని, ఏక — ముఖ్యమైన, "ని. ఏకేముఖ్యాన్య
కేవలాః" అ. భర్త — అధిపతియైనయింద్రుఁడు, ఐనన్ — అయినప్పటికిని, తన్నున్ — ఆరంభను,
భూసురప్ర్వనకున్ — పుడమివేల్పుపైన యానిరంకుశునకు, ఒకనాఁడ — ఒక్కదినమే, పోయి — అతని
దగ్గరకుఁబోయి, కౌఁగిలిచ్చిరమ్ము — ఆలింగనమొసఁగిరమ్ము, అని — ఇట్లుచెప్పి, పంపినాడు — అంపి
యుండెను, ఇంతెకాని — ఈమాత్రమే కాని, సంతతమున్ — ఎల్లప్పుడును, వానితోడన్ — ఆబ్రాహ్మ
ణునితో, కేళిసల్పుమనుచున్ — సంభోగించుచుండుమని, పలిచెనే — పలికినాఁడా.

క|| ఈమాటలు ముని దివిజ, స్వామికి విన్పించువేళ • జననాథ యతం
డే మైత్రిఁ బ్రశంసించుచు నా, యామానిని యతని కంత • యలికెం జూమ్మా. 25

అ|| జననాథ — ఓరాజా, ముని — ఆనారదుఁడు, ఈమాటలు — ఇచ్చటజరిగిన సర్వవృత్తాం
తమంతయును, దివిజస్వామికిన్ — దేవతాప్రభువగు నింద్రునకు, వినిపించువేళని — చెప్పినట్లయిన,

అతండు – ఆయింద్రుండు, ఏమనిశాసించునో – ఏవిధముగ నాజ్ఞాపించునోకదా. ఇచట 'ఏమని' అనుటను 'సూ. ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు' బా. వ్యా. అని – ఇట్లు తలంచి, ఆ మానిని - ఆమానవతి, అతనికిన్ - ఆనారదునకు, అంత - అంతయనేకముగా, అలికెంజుమ్మీ - భయపడెనుసుమా.

—: నారదుండింద్రసభకుం జేరుట :—

వ॥ ఇదియిట్లుండె నట నారదుండు చని యెదుట హాహాహూహూముఖ్య విఖ్యాతగాయన గేయ నవీనమాధురీ ఝరీతరంగనినదాయమాన మేనకాద్యప్సరః పాత్ర విచిత్రకంకణ ఝణత్కారచామీకర మేఖలాకింకిణీ ఘుళఘుళనూపుర కలకలధ్వనులచే సంతసించుచు సంతతవందమానత్రయస్త్రింశత్కోటి దేవతా సంసేవ్యమానుండై రత్నసింహాసనంబున నాసీనుండై యున్న సహస్రలోచనుం గాంచి నిలిచిన. 26

అ॥ ఇది - ఈవృత్తాంతము, ఇట్లుండెన్ - ఇటుండనిమ్ము, అట- అక్కడనుంచి, నారదుండు- ఆనారదమహర్షి చని- పోయి, ఎదుటన్-తనముందు, హాహా......ధ్వనులచే-హాహా...... హూహూ-హాహాహూహూవులను పేరుగల, ముఖ్య - గంధర్వ ప్రముఖులలో, విఖ్యాత - ప్రసిద్ధిగల, గాయన సంగీతమును పాడునట్టి పురుషులయొక్క, గేయ - పాట, నవీన - నూతనమైన, మాధురీ - మాధుర్యమనెడు, ఝరీ - ప్రవాహముయొక్క-తరంగ - అలలతోడి, నినదాయమాన - ధ్వనించుచున్న, మేనకాది - మేనకమొదలగు, అప్సరః - దేవవేశ్యలలో అప్సరః, నీళ్లనుండిలేచినవారు అనివ్యు. "అప్సు నిర్మథనాదేవరసాత్తస్మాద్వరస్త్రియః ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్" పాత్ర - నాట్యమాడెడు స్త్రీలయొక్క, విచిత్ర - చోద్యమైన, కంకణ - హస్తాభరణములయొక్క, ఝణఝణత్కార - ఝణఝణయనిమ్రోగుచున్నట్టియు, చామీకర - సువర్ణమయమైనమేఖలా - మొలనూలుయొక్కయు, కింకిణీ - చిఱుగంటలయొక్కయు, ఘుళఘుళ - ఘుళఘుళయనెడు, నూపుర-కాలియందెలయొక్కయు, కలకలధ్వనులచేన్- కోలాహలారావములచేత అనఁగా బహువిధములగు నినాదములచేననుట, సంతసించుచున్ - సంతోషపడుచు, సంతత......మానుండై, సంతత- ఎడతెగని, వందమాన- నమస్కరించుచున్న, త్రయస్త్రింశత్కోటి - ముప్పదిమూడుకోట్ల, దేవతా - దేవతలచేత, సంసేవ్యమానుండై - కొలువబడుచున్నవాఁడై, రత్నసింహాసనంబునన్- దేవలోకమునఁగలమణులతో నిర్మింపఁబడిన రాజపీఠమునందు, సింహాసన మనగా సింహముఖమేర్పఱచియుండు కనకమయ మగు నున్నతపీఠము. ఆసీనుండై - కూర్చున్నవాఁడై, ఉన్న సహస్రలోచనున్ – ఉండిన, వేయికన్నులుగల యాయింద్రునీ, కాంచి - వీక్షించి, నిలిచినన్- నిలఁబడఁగా, 'ముఖ్యవిఖ్యాత-గాయనగేయన-మాధురీఝరీ-పాత్రవిచిత్ర-కంకణఝణఝణ ఇత్యాదులనుప్రాసాలంకారము.

తా॥ దీనినిట్లుండనిమ్ము. అచ్చటినుండి కలహభోజనుం డరిగి తనయెదుట హాహాహూహూవులనెడు గంధర్వప్రముఖులలోఁ బ్రసిద్ధికెక్కిన సంగీతవిద్యాధికులయొక్క గానమునందలి మాధుర్యమనెడు ప్రవాహముయొక్క యలలతోగూడి ధ్వనించుచున్న మేనక మొదలగు దివిజవేశ్యలలో నర్తకియొక్క వింతయైన హస్తాభరణములయందలి ఝణఝణ యనుమ్రోఁతయొక్కయు,నపరంజి మొలనూళ్ల

రొక్కయు, జిలుగుటలయొక్కయు ఘళఘళయనెడు కాలియందెలయొక్కయు మిశ్రితరవములచేత నానందమునొందుచు ననిశము నమస్కరించుచున్న ముప్పదిమూఁడుకోట్ల దేవతలచేఁ గొలువఁబడుచు దివ్యమణులతో రచింపఁబడిన రాజపీఠమునందుఁ గూర్చుండిన వేయికన్నులవానిం గాంచి నిలువంబడఁగా.

—: ఇంద్రుఁడు నారదుని సమాచారములడుగుట :—

క॥ మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్య ♦ పాద్యాదివిధు
ల్వినయముగ నొసఁగి యర్హాసనమునఁ గూర్చుండ ననిచి ♦ సలలితబుద్ధిన్. 27

అ॥ సురపతి - ఆదేవతాప్రభువు, మునినాథున్ - మునులలో శ్రేష్ఠుఁడగు నారదుని, కాంచి - వీక్షించి, సలలితబుద్ధిన్ — ప్రకాశించుచున్న తెలివితో, ప్రణుత.....విధుల్, ప్రణుత - స్తోత్రము చేయఁబడిన, సమారాధన - పూజించుటయును, అర్ఘ్య - పూజాద్రవ్యమును, పాద్య - పాదోదకమును, ఆది - మొదలుగాఁగల విధుల్ - విధానములను, చేయుటలను, వినయముగన్ - నీతితో, ఒసంగి - ఇచ్చి, అర్హాసనమునన్, అర్హ - ఉచితమైన, ఆసనమునన్ - పీఠమునందు, కూర్చుండనునిచి - ఉపవిష్టుఁడగునట్లుచేసి,

తా॥ దివస్పతి యమ్మునిశ్రేష్ఠునిఁ జూచి తనబుద్ధికుశలత దీపింపఁ బూజాద్రవ్యమును బాదోదకము నిడి తగినపీటయందు గూర్చుండఁజేసి.

క॥ మునియనుమతిఁ దానుచితా, సనమునఁ గూర్చుండి సత్ప్ర ♦ సంగంబున నో
యనఘాత్మ యెచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదు ♦ జన్మఫలమునన్! 28

అ॥ మునియనుమతిన్ - ఆనారదునియొక్కసమ్మతితో, తాన్ - ఆయింద్రుఁడును, ఉచితాసనమునన్ - తనకర్హతగల సింహాసనమున, కూర్చుండి - ఆసీనుఁడై, సత్ప్రసంగంబున్ - మంచిప్రస్తావనతో, ఓయనఘాత్మ - ఓపుణ్యపురుషుఁడా, ఎచటికరుగుచున్ — ఎచ్చోటికి బోవుచు, నాదుజన్మఫలమునన్ - నాయొక్కజననకాల శుభప్రాప్తివలన, ఇటకున్ - ఇచ్చటికి, చనుదెంచితిరి - వచ్చితిరి, ఈ బహువచనప్రయోగమునకు "స్యాత్పూజ్యత్వ వివక్షాయాం మహతాం బహుతా మతా" అని యర్థ. ఇచట ప్రస్తావనవశమున నారదునడుగుటయు నాతఁడు రంభయొక్క కృత్యములను జెప్పుటయును యుక్తియుక్తమే 'సూతాః పౌరాణికాః ప్రోక్తా మాగధా వంశశంసకాః, వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః' అనిశాస్త్రము. 'మునియనుమతితానుచితా' అనుప్రాసాలంకారము.

తా॥ ఆసంయమిసమ్మతితోఁ దానును దనసింహాసనమునఁ గూర్చుండి మంచిప్రసంగసందర్భమున నోపుణ్యాత్మా! ఎచ్చటికిఁ జనుచు నాయదృష్టవశమున నిటకుదయచేసితిరి?

—: నారదుఁడు రంభనేరములఁ జెప్పుట :—

క॥ అన విని ముని దరహాసితా, ననమున సురలోకనాథ ♦ నానాదిశలం
జని భువిని జిత్రమొక్కటి, గని వచ్చితి మీకుఁ దెలుపఁ ♦ గాఁ బలికెన్. 29

